# పరిచయము

సహదేవ సూర్యప్రకాశరావుగారు "మునిమాపు" అనే ఖండకావ్యసంపుటిని రచించి ప్రకటించియున్నారు. తెలుగువారికి వారికవిత్వము పరిచయమైయే ఉంటుంది. మళ్ళీ ఈయేడు అంగీరసలో "వకుళమాల" కూడా ప్రకటించుచున్నారు. ఇది కూడ ఖండకావ్యసంపుటమే. వీరికవిత్వము నాటినుండి చెందిన పరిణామము ఈకావ్యము గోచరము కాగలదు. ఈవకుళమాలకు కవిగారు నన్ను పరిచయ వాక్యములను వ్రాయుమన్నారు. నేను సందేహించితిని. ఎందువల్లనంటే పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు ఆంధ్రీకరించిన రాజశేఖర కవికావ్యమీమాంసలో కవికిని, భావకునకును జరిగిన సంభాషణ [illegible] బడినది. అది ఇది.

"ప్ర : ఎవరునీవు?

ఉ : అయ్యా! కవినినేను.

ప్ర : ఏమైనను అభినవసూక్తికలదేని మిత్రమా, చదువుము.

ఉ: ఇప్పుడు నేను కవితాప్రస్తావననే తలచుకొనటలేదు.

ప్ర: ఏల, ఇది?

ఉ: వినుడు. స్వయముగా తాను కవియై గుణదోషముల సారమునెఱింగి, చక్కగా విమర్శింపగల భావుకుండే ఉపక్రమించుటలేదు. అథవా ఎచ్చటనైన నొకం డున్నను, అతడు దైవవశమున మాత్సర్యమును విడియుండుటలేదు; కావుననే నేను కవిత్వమును వదలితిని.'

ఆగ్రంథములోనే ఇంకొకచోట ఈవాక్యములున్నవి. 'ఎదుటలేకున్న (అనగా మృతినొందిన లేకున్నచో దేశాంతరగతుండైన) కవిసూక్తిగానము చేయుటయును దేశాంతరమున నున్న నుతించుటయును అనునిది సనాతనముగా వచ్చుచున్న లోకధర్మము. ప్రత్యక్ష కవికావ్యమును, కులస్త్రీయొక్క రూపసంపదయు, గృహవైద్యుని వైద్యవిద్యయును, సాధారణముగా రుచింపవు. ఒకవేళ రుచించినచో ఎవ్వరికో ఒకరికే రుచించును' ఈ వాక్యములలోని సత్యమును గ్రహించినవాడనైనప్పటికీ మిత్రునిమాట త్రోసివేయలేక ఈపనికి పూనుకొన్నాను.

పరముగా కవిత్వము చెప్పుకొనే పలువురు కవులలో ఇటువంటిరీతి కానవస్తున్నది. ఈపదములే ఇటువంటిపద ములే ఇట్టికవుల కావ్యములలో అంతటా గోచరమగు చున్నవి. శబ్దసాదృశ్యమే కాకుండా భావసాదృశ్యము కూడా కనుపిస్తున్నది. పలువురికావ్యములలో ఒకేశబ్ద ములు ఒకేభావములు కనబడు చున్నప్పుడు అదిచౌర్య మనిపించుకోదా—అంటే ముందుగా ఆశబ్దములను ప్రి యోగించినవారున్నూ భావములను వెల్లడిచేసిన వారు న్నూ ఎవ్వరుఅనే విషయము తేల్చవలసిఉంటుంది. సమకాలికుల కావ్యములలో ఇదితేల్చడము కష్టము. ఆకాలములోనే అట్టిభావములు ఇమిడిఉండి సమాన మైన అనుభవములు వేర్వేరుకవులకు కలిగినప్పుడు వారిలో అవిఅంకురించి ఉండవచ్చును.

గ్రంథచౌర్యము విషయమున కావ్యమీమాంస ఇట్లు చెప్పుచున్నది.

'అర్థాంతరములలో కూర్చిన అనుకరణోక్తులు బయ ల్పడక రసములొలుకుచుండును. ఇట్టివి హరణమును కూడ హరించునవియని యాయావరీయుండు అనెను.

చౌర్యములేని కవిగాని వర్తకుడుగాని లేడు ఎవ్వడు గూఢముగా వాచ్యమగు నర్థమును గూర్చగలడో అతఁడానందమునకు పాత్రుడు. కవులలో ఒక్కడు ఉత్పాదుఁడుగను మఱొకడు పరివర్తకుండుగను ఇంకనొకడు అచ్ఛాదకుండుగను, మఱియు నొక్కడు సంపుటీకర్తగను నుండును. శబ్దార్థములలో నూత్న విశేషములను కనుపెట్టువారును ప్రాచీన సూక్తులలో గలకొంతనైశిష్ట్యమును అపేక్షించు వాడు నగు వాడే మహాకవియనదగు'

ఈ వకుళమాల ఆత్మపరముగా చెప్పుకొన్న కావ్యము.

ఆమె వాసమ్ము నాహృదయమ్ము, ఆమె
జీవితమ్ములో నాభుగ్న జీవితమ్ము
కెరలి ధ్వనియించి మారుమోగినది.

అనియు

ఇగిరిపోవు నోయేమొ ఈహృదయపాత్రి
మందు తొణికిసలాడు సుధాసవమ్ము
నాచెలియమోవి రేకులంటకయె జారి
నేల పాలౌనొ...

అనియు

ఆమె లోకమ్ములో లేదు...
అప్పుడే మూగవారిన దామెనాగ
ళమ్ము వోలిక...
కనులు తెరచియే నిద్రపోయినదియామె,
నేను మాత్రమ్మె శోకాన నిలిచిపోతి.

అనియు

అది రథమ్ము ద్యోవీథి విహారసీమ
నవతరించివచ్చినది ఆశాశలెగయు
నీవధిష్ఠించి సాగయుచున్నావుదేవి
ముగ్ధమాధురీ స్వాప్నికమూర్తి వోలె.
నీరథమ్ము పోయిన పూలదారులందు
ప్రతిసుమమ్ము హసించి స్వాగతమొసంగు
హారతెత్తును మేఘకుమారి లలిత
భరతనాట్య కళాకలాపమ్ముతోడ.

అనియు కవివ్రాసికొన్న వాక్యములను బట్టి కావ్య మందు వర్ణితమైన విషయము బోధపడుచున్నది సున్నితమైనకవి హృదయమున్నూ తేటబడుచున్నది.

నేడు ఖండకావ్యాలు వ్రాసే కవులలో కొందరు దేశప్రాచీనౌన్నత్యమును పొగడుచున్నారు. కొందరు సాంఘిక

దురాచారములను నెత్తి చూపుచున్నారు. కొందరు గేయములను వ్రాస్తున్నారు. కొందరు పల్లెటూరి జీవనమునుకొనియాడుచున్నారు. కొందరు ఆత్మపరంగా కవిత్వము చెప్పుతూ వారివారి కష్టసుఖములను, అనుభవమును వెల్లడిస్తున్నారు. సూర్యప్రకాశరావుగారు కృష్ణశాస్త్రిగారు, ఘండిపండా అప్పలస్వామిగారు శ్రీ. శ్రీ గారు, మున్నగు కొందరు ఒకతెగకుచేరు తారని ఊహించవీలగుచున్నది.

కొత్తకొత్త రకపు కవితా సామగ్రి, కొత్తరకపు శబ్ద జాలము, కొత్తకొత్త భావములూ అనుభవములూ కూర్చి మృదువుగా మధురముగా కవిత్వము చెప్పగల ప్రజ్ఞ వీరికగలదు. ఇతరుల కావ్యములతో పాటు వీరి కావ్యములున్నూ ఆంధ్రసారస్వతమునకు అలంకారము లుగా నుండును. వరుశమాల నిత్యమూ సౌరభోపేతమై ఉండగలదు. దేశాభ్యుదయమునకు తోడ్పడే రసవత్కావ్యములు రచించుటకు భగవంతుడు వీరిక ఆయురారోగ్యములు ప్రసాదించుగాక.

రాజమండ్రి
12_10_32

శ్రీ చింతా దీక్షితులు
బి. ఏ., ఎల్. టి.

❖

తరళ మానాశ్రితప్త గీతావితాన ;
మీకిశోరతారాహృది సోకుచుండు ;
నీవకుళమాల ధరియింపుమీవె, లలిత
కంఠమాలగా, వలపూరగాచిరమ్ము,

❖

# ఆమె

ఆమెవాసమ్ము నాహృదయమ్ము, ఆమె
శాల్మలీసూనహాస మంజరుల, ఆమె
జీవితోత్సవ ఘంటికా శ్రీలయందె
నాయెడంద, నాబ్రతుకు సందములు మ్రోగె.

ఆమె లోకమ్ములోలేదు, ఆమెశర్వ
రీతపస్విని, ఆమె కార్తికీకచంద్రి
కావయస్విని, సురకబరీవిలాస
కేలితలకాంత లావణ్య గీతికామె.

అప్పుడే మూగవోయిన దామె నాగ
ళమ్ము లోలోన; ఆమెనేత్రములతుదల
తరళమందస్మితులెకాదు, విరులెకాదు,
కోనలు కోవక వాలి పోయినవినాడు.

కనులు తెరచియే నిద్రపోయినది యామె,
పూల మొత్తాలు, లలితహాసాలు, పొంత
రులుగ శయ్యాతలాన కాగొన్నవపుడు
నేనుమాత్రమ్మె, శోకాన నిలిచిపోతి.

నాగణించుకొన్న బ్రిదుకు, నన్ను విడిచె
మర్త్యగానంత బాధాస్మృతులు మిగిల్చి,
నాసఖిమృదు హృదయమ్మె నవయఁబోదు
నవయఁబోదు, లోకమ్ములున్నంతవఱకు.

ఆమె వాసమ్ము నాహృదయమ్ము, ఆమె
జీవితమ్ములో నాభగ్నజీవితమ్ము
కెరలి ధ్వనియించి మారు మ్రోగినది; ఆమె
కనుల నాప్రేమ కలగ వ్రేలినది.

### ఆమె

నవవిలాస తారాశోభనముగ, మెరుపు
మెరపుగా, ప్రత్యూషస్నేహ మృదులహాస
వల్లరీలాస్యహేలా ప్రఫుల్లరుచిగ,
కలల కల్యాణిగా నాకు కాసిపించు.

రమ్యప్రేయసీ! హృదయ కార్శ్యము నశింప
గాలి కెగసిపోయిన పూల కన్నెవలపు
నాయెడంద లోరాగిల్లిపోయి, కలయ
ద్రిప్పు స్వప్నస్నపిత రహస్త్రగములను.

# చాలు

పసుపుకోకల విదళించి, మసకసంజ
లేతచీకటి తెరనివాళింపువెట్టి
చలితపక్షాల నెగయు వసంతకాంత
ముగ్ధకోయిల నోచెనే మూగనోము.

నీలిమబ్బుల చలువ కన్నీటిపాట
నెచట నెప్పుటనో నదియించి, తొగరు
విరుల వగరు నెత్తావుల గుసిపివైవ
తలకి వాపోయెనేమొ? చాతకలతాంగి.

వానచినుకున నిలిన పరిసవహృదయ
మట్టి కనుమోడ్పు వెట్టు తీపారువేళ;
సుప్రసవయస్వికేగో, సంధ్యారనియతి
చూపుకొసను, పసుచుమసపుసను కూడ.

చిఱుతగాలికౌగిళ్ళ కృశించి, నీలి
మాంబరాంబుద పాళి నుయ్యాలలూగి;
చవితినెలవంక రేక విషాదమంద
ముసుగు సవరించుకొన్నది ముగుద కుముద.

వలిపెవెన్నెల వాసెలో, కలయదిరుగు
చికిలినవ్వులె, సిగ్గుమబ్బికలె, చిటిలి
వలపుమూసిన హృదయాన, పరిమళింప
విసవిసలుపోయి, వందురు నెకిలిమనసు.

లలితలవలీలతాంబిక, వెలితిజగతి
హాసములకోడి, ఘుయిపోడి, యాలతపోయి,
చివురుజూపు జీవమ్ము కుంచించుకొనగ
తిమిరకల్లోల కోలాహలము గ్రసించె.

ఇంత కోలాహాలమ్మేని, యేనయేనె
ఊర్ధ్వకయాసహింతు లతాంబి కార్చనమున
వనపుచూపులె, పోసవాసనలెచాలు
ప్రణయ విశ్వాసమేచాలు, మనసెచాలు!

# తర్పణము

చీకటి మొయిళ్ళగుంపుల చిక్కువడిన
మెరపుకన్నియ హృదిలోన మెరయు నగ్ని
గీతికాకంద వల్లీ పరిభూతలలిత
మందమాధురీ లవలేశమాత్రమేని
చిందునా? మోడువోయి కృశించియున్న
జీవితమ్ములో?

కురియు నశ్రువిసరులు
గొలుపునా? విషాదము గొలుకొని నన్ను
అలరుచూపు వెరపుమంట లొలయకుండ

మూగవోయిన జీవిత రాగపదము
ఇరుకుచీకటి సందుల నిరుకుకొనిన
యప్పుడేని వచ్చెదవ? రానొప్పవేని
పని నీయడుగులచాయ సేవరింతు.

❖

వ్రాకినది లవలేలతి కాకుమారి
పూలనవ్వుల వలపు పిసాళిగాలి
కొఱకొ, తనబ్రదుకుకొఱకొ, మఱపురాని
జీవితమ్ముపా లతాంతాల పలుకుకొఱకొ?

ఆలతాంబేక చిఱునవ్వ నంతవెలది
వెన్నెల, కడిదివెన్నెల, నెగటుబోని
మొలకవెన్నెల, చిలుపత్తై పొంగిపొరలి
యొదిగిపోవు పిశాల పిశోవ్యోదరముస.

ఎన్నియెన్ని జక్కవగవ, లెన్నియెన్ని
కుముదకోరక పాళిక, లమరగీతు
లురుల, హృదయవీణాతంతు గొంత్తైనన్ని
ననలదోసిళ్ల నైవేద్య మునురచించి.

అంతనేమాయె-అంబికా హాసవల్లి
కాముసృణవాస నాస్నాన కలన సవక
మంది, సురభీకరిలె; శిశిరాప్తిగోసిన
అలరుదీవలు నాహృదయమ్ముగూడ.

ఆయమరహిమానీ హాసమందు చిందు
మధురహేమంత సీమంత మార్గరేఖ
గోరగిలిన కాశ్మీర సిందూర తరళ
నాత్మచైతన్య సుషమా మనోజ్ఞశోభ.

అమృతహాసమ్ములో, హాలహాలము చిలికి
నారు; చీకటిసందిళ్ల తారకావ
యస్విసీమృదుహృదినిక్టి హత్తి చిదిమి
నారు; కొనవారుకోర్కె వాలారుగోళ్ళ

# వృత్తము

కావిచివురుసంజల తారకాచిరత్న
రత్నరాగశుభోదయ రాగగీతి
కారహార్ద్రదేశమ్ముల, కలచివైతు
రెవరు? పూలనేకాదు నాయెదనుకూడ.

ఈపిలుపులే కడలనుండి? ఇపుడుపిలుతు
రెవరు? శ్యామతామిశ్రిము గవిసికారు
కొన్నవీనీవిటంకోపగూహామందు
నిలిచి నన్ను పదేపదే పిలుతురెవరు?

నేనుపోలేన, వదలికోలేన, నిన్ను
సకియ! నీచలితాపాంగ చకితవీథి
కాదె, దిశలుమూసెడు నల్లకాడె, చాలు,
నీచరణనూపురారవోన్మిషితపదము.

అదియొపదివేలునాళ్ళ, సమాప్తిలేని
శోకజీవితకావ్య ప్రసూనదళము
ఇప్పుడేని విరియకుండునేమి ? సుభగ
నందనానందకుంద మరందలవము.

కోలుకోలేక, కనుమూసి, కునుకు పోని
హృదియె చెలువుకందువ స్నేహామృతమెఱుగు
చీకటుల పసందులరాణి! నీకె వెలియు
నట్టి ప్రత్యూష పీయూష హాసశోభ.

# ఉష

ఓయుషోహాసినీ, ప్రేయసీ, ఇదేమి
గానమేగాని, రాగాంక కల్యాణమేని
మొరసి, పులకరిల్లక నన్నుముంచనేలా
నిదురమూగిన మూగకన్నీటిసోనల.

ఇగురు కొరసిన కెమ్మోవి తొగరుచిగురు
రేకురేకులనిగురించు మృదువిలాస
హాసవల్లరీ డోలిక నోసరిలక
ఎంతసేపేడ్చినా నినిశాంతమందు.

తొలకరిల్లిన మబ్బులేదనుకయొకటి,
కనులపడగ; ఆశానిరీక్షయె నిరీక్ష
గా, యుగమ్ము యుగమ్ముగా, కలవరిలిత
రగులుకొన్నదేమిటికె నైరాశ్యమిటుల.

ఈనిశాంత ప్రశాంతమందివురులొత్తు
మంచుకన్నీటిజాలులే మరగువాగు
జీవపుకొసరుతేనియ జీబుకొనెను
కసటువోని కార్మొయిళులే ముసరునేడు.

చెక్కిళులపస దుల కళాసించిపోయి,
సొలసిపోయిన ఇసిరింత చూపుకొసల
కొనలుదేరిన కడపారి మినుకుతలపు
ప్రొద్దుపొడుపులనే, పులపొడుచునేమొ?

తూరుపుమొగాన తరళసింధూరరేఖ
మసక మసకలైనది కారుపినపునీడ;
మబ్బుదొంతర తుప్రిళ్ళింక మాటుమణగి
నాటిచూపు లేనాటికేనాటికగునొ.

# ఏలమరణించిపోను

ఏలమరణించిపోను? నన్నేలనిపుడు
చుక్కలే, చిరుమెరుపులే, రాగయుబోని
కటికికాటుక చీకటి కవియదేమి?
మీదపడదీ ముహూర్తాన మిన్ను విరిగి!

హృదయకుసుమమ్ము నొక్కొక్క రేకు రేకు
చిదిమి విరియగా జిమ్మ్రివై చనసుగూడ
ఓడ్చుకన్నీటి చుక్క, నిట్టూర్పుసెయ్యి,
ఆగికోలేనె, చెలియ! ఈమూగబాధ.

ఎవరు సహాయింపనోపుదు రీయనంత
సాగరార్ద్రిమహోజ్వల జ్వాలమాల.

ఎవరు భరియింపజాలుదు రీవిసీల
విలయ కాలాంబుదమ్ములో ప్రళయపవన
చాలనమ్ములో రేగిన చరమసాంధ్య
రాజచరణ విన్యాస కోలాహలమ్ము.

తుడుచుకోరాని కన్నీరు, విడువలేని
నిడుద నిట్టూర్పువాంతర, బడలిమూత
వారులేమెద, సందడింపంగ బోసి
బ్రదుకు, నశియింపదేమి కల్పమునగూడ.

ఏల మరణించిపోను? నన్నేల నిపుడు
మంచుగురిపించి ఝల్లుపింపమకరము
కనులనొత్తి, గద్గదమోవ గళమునొత్తి
మింటజూపుగా జేయునేమిటికి నకయ.

# ప్రతీక్ష

ఈ నిగూహన శ్యామికా హృదయవాటి
నిలిచి చదలేటి యెలుగెత్తి పిలచుచుంటి
నీవనీద్వారమెవరు బంధించినారు
తరలిరారేమి, ద్వారమ్ము తెరువరేమి.

ఇరులచెలి తమోయాత్ర సాగించుకొనుచు
వినియెకాంబోలు పిలిచిన పిలుపునన్ను!
గొనుగువోయిన యాకాశకుహరపదము
చుక్కలమినుకులోన కుంచుకొనిపోయె.

తెరచివేయుము వేకువ తీవకొనలు
సాగిరేకొత్తకుండ
నిశాప్రియాల
నయనకోణశోణాంకితనవనవ ప్ర
సన్న మధురమ్ములాలికై నీ వకితపిన.

విరులునెరసంజచివురు కావిరులతెరల
వెడలి నిట్టూర్చి మాగ్రిగన్న పెట్టె;
సిగ్గు

వలపులివమె; చీకటివెల్లువలుతరించి

తెరచివేయుము వేకువవెవకొసలు
సాగిరే కొత్తకుంప

నిశ్వాసమూర్చి

తెరలుతెరలుపోవుచు, తరితీపుతోడ
తేరికోలేక, యాశాప్రతీక్షలోన
నెడదచుమ్మలుపోవ; అంపిల్లుబ్రిదుకు.

ప్రణయపులకితసోపాన పథమువీడి
ప్రసవహృదయమ్ముకై సేయువచ్చినాను.

చంచలచ్చంచరీకపక్ష్మాంచలాల
బరువువ్రాలిన ప్రణయినీ ప్రణయగీతి
మిహికాశిశిరాలసాని లోర్మికలదేలి
తేలి ఎఱ్ఱని చిక్కని నీలిదాఃపి
చెవికిసోకన దీమబ్బు చీరదాటి
లేతవలపుదొంతరల తుళ్ళింతపొరల

జాగరింపు లేలో దురాశామనస్వి,
మొయిలు చికట్లరాయిడి మునిగిమునిగి
వ్రేలినవి నిశాకైశికజాలకములు,
ఈకృశానుప్రతీక్ష వేగింపలేను
తెరచివేయుము వేకువ తీవకొనలు
సాగిరేకొత్తకుండ

ఇగిరిపోవునో యేమొ ఈహృదయపాత్రి
మందుతోణికెసలారు సుధాసవమ్ము
నాచెలియ మోవిరేకలంటకయె; జారి
నేలపాలౌనో
తెరచివేయుము వేకువతీవకొనలు
సాగిరేకొత్త కుండ

# అభిసారిక

ఒక్కచుక్కేని తరళింప కుండ కవిసి
కొన్న ఈవర్షలక్ష్మి చికురవినీల
కుటిలజాలకపాళీనిగూఢవిజన
పథమువంబోవువనిత ఎవ్వతెవునీవు.

నీత తూలాలకై శికపాళి బూతబూసి
సోగరేకులనరవిచ్చి సొగసిపోయి
అమల సౌందర్యసారళ్య మయినబ్రదుకు
పుచ్చుకొన్నసూనములు నవ్వులనటించు.

అందెసందళ్ళమ్రోసిన అమరపదము
అడుగుసప్పులఁత్రోపాడి బడలివెడలు
నిడుదనిట్టూర్పుగాలిలో, నిదురతూలి
వేగునిసియెదలో, మారుమ్రోగికొనును.

నీమనోహర హృదయాన ఏమివలపు
మేల్కొన్నదో కిసలయించి పులకరించు;
తాఁక ఈనవాషాఢ మేఘాలజాలు
తోఁప్రుళ్ళుల నీప్రియాణ మెందుఁ కువనిత.

వలపులోఁ కంటకాలకే కలసిపిరియ
మనక తెరచాటు తెరలించి పసిమిపసిడి
సుషిరమధురగానమ్ము ప్రసృతవీథి
కలలకల్యాణతోరణముల, కదంగు.

వయసుసాగసిన నీయెద పదమునందు
ప్రియువయస్వి ఏమధువివ్వరించినాడో
కలికిపూల వలపువాసనలుకనల్చి
తీయనిపథాల బోఁ దరికిఁ పువెళ్ళె.

నీలిమొయిలుమొత్తాల నాట్యాలకోతె
తీయకందకోరికలు తుళ్ళింతలాడ
తనబహుపదాల సిగ్గుదొంతరలువిరియ
కడలతీయవాసన బసిగట్టినావు.

ఇదితమోంతమనస్సుందరి, మిదికరాళ
నిజనరజనీముఖమ్ము, కానిరులతెరల
మెరపులేశమే, మిణుగురే, మెరయుబోళ
కుటిలమై కుంచుకొనెను చిమ్మటలరొదల.

నేడువలపు చేదోడు వాదోడుగాగ;
పోవుచున్నావు తలపునెత్తావిభరము
అడచుకోలేని నీహృదయమ్మువ ని
లీనరాగమహాస్సు వరించుకొనెనో.

చేతికర్పూరదీపిక చీరచెరగు
ఛాయలో చలియింప, ప్రశాంతిలేని
మనసు ముక్తరాగానందమున మునింగి
విరిసికొనిపోవు ఆశానివేశమునకు.

చివురుపాదాలుకందిన, పువ్వులచాలు
విరియబోసి, ముద్దునొత్తు ప్రియునిదరియ
బోవుచున్నావుకాబోలు, పూలనోము
పట్టినావులేమధుమాసవాసరముల.

అలలహస్తాల కౌగిలింతలఁగరంచ
ఈశుభాషాఢగౌతమి, ఎగసిఎగసి
నీయెదఁగుసన్నలో నిస్వసించుకొనును
నీవలెనె నిత్యయాత్రోపజీవియామె.

నీవలపుపయనమ్ముతో, నీలిమాంబు
దాలగాలు, వినీలపక్షాలనార్చి;
కురియుస్వప్నాల గీతాలమొరసి; బరువు
ఎదకరగితేలిపో ప్రయాణించుకొనును.

❖

సకియ, చూపుల రంగవల్లిక రచించి
వేచియున్నది; పూర్వదిశాచలాంచ
లాల హారజటాజూటవధాల పొరలి
చిలుకు మిన్నేటి పన్నీటి వలపుకొరకు.

ఎదలు మాటాడుకొన్నవి బెదరి బెదరి
కలసికొన్న వీక్షాంతాంచలము విచ్చి
చివురు సంజలచాయల నివమి, తడియు
వెన్నెల ననువెలుంగులై మిన్న బ్రాకు.

కరము కరము గీల్కొన్నది, కలికసంజ
ఎఱుపుతావుల చదలల్లి, వెఱపుజూపి,
సిగ్గుజూపు, తలపుజూపి, చిక్కువీడి,
తొలగి, తొలిమంచు తీవలై మలసికొనును.

పెదవి పెదవి చుంబించుకొన్నది, కరంగి
సన్నగా; సన్నగా, విచలన్నవాంఛ
దాల రవళింపు మధురింపులేలో, గళము
లోన పాటగా విరిసి కార్కొసియెనాడు.

నాటితొలిసారి కౌగిలింతల హాసించి,
కనులు తెలిదామరల తొలుకారుసోగను
గుత్తకొన్నవి; అచటచివురొత్తు నచట
రాలిపడును, నవోషఃపరాగపదము.

మోవిచివురాకు చలియింప తీవచెలియ
ఎన్నికుసుమాల హాసియించె, ఎదమురంగి
గుబులుకొన్నది.

# కానుక

ఈనవాగమాబ్దమ్ముతో, ఇరులు విరిసి
విరులుకురిసి నీభావిజీవిక వెలుంగఁ;
కనులకొనల సౌభాగ్యభాగ్యసుభగాంక
రేఖ, సాంద్రమై సురభీకరించు చిరము.

నవసరోషఃప్రవాళారుణప్రసన్న
నిత్యతారుణ్య లావణ్య నిబిడరక్తి;
అప్సరోంగనామృదుల హాసార్ద్రమగుచు
దినము దినము నీభవితవ్యమున నటించు.

వెలుఁగు చీకటి కౌగిలింతల పసందు;
శీతలామలజ్యోత్స్న వాసించు వలపు;
సాంధ్యమల్లీమనోజ్ఞ వాసనలకలిమి;
కనుల, హృదయాన, భావాన, కదలుకొనెడు.

చేదులారిన తేనియజీవితాన
తలపులాచికోలేని సందడుల జడుల
పరుగువారుము తలపుచందిరునిదారి
పవడపువిపంచితో, పూలపాటతోడ.

ఇదియుగాది గానోత్సవమెందు లేదు?
కనులు విరిసి సుభగతారకాప్రభాత
చలిత లలితమ్ములైనవి, అళికులాన
నెన్నికలల పెండిలి సందడింపులిపుడు.

తీయని వెన్నెలన్ వలపు
దేరిన యామిని నవ్వుదారి, కో
కోయను పాటలేత వెలుగుల్;
నునుగ్రొన్నన తేనెసోన, మై

పూయని పూతలై మెరసి
పోయిన ఈశుభవాసరమ్ము, నీ
కే యతిలోక మాధురులివే
కయిసేయుము స్నిగ్ధసూనమా!

ఏశుభాశీస్సు వర్షింప ఇవముకొన్న
పూర్ణిమాయామినీ వీధి పులకరించె;
ఆశుభాశీస్సు వర్షింప నీశిరాన
కురియు సుకుమార మందారకుసుమవృష్టి.

# తపస్విని

ఏమి ఏమి
పూల నోముల నోచినావోయి? ఇంత
మిసిమి మెత్తని హృదయమ్ము, కుసుమలలిత
జీవితము దొరకించుకొన్నావు; సఖుడ
వీవె, ప్రణయ తపస్వివినే నిజమ్ము.

ఓ యమాయికుడా! చాలునోయి, గుండె
లురులగాజేయునోయి నిట్టూర్పు లనము
ఎవరెఱుంగుదురోయి ఈయెదలు చదల
కదలి కదలి విహరించు మృదుల పదము.

ఎవనికై తపియించిపోయితినో నేను
అతడె లభియింప విడుతునా? అసురసంజ
చికిలితొలిమంచు తీవ సజ్జపుకచాయ
పిదులగా, నను నేనె యర్పించుకొనక.

చనవు లివమిన మాపులేశాలనెవుడు
చివురు జూపెనో నీ ఎఱ్ఱజీరకనులు;
అప్పుడే రాగిల్లి నాహృదయమ్ము, వలపు
పూలజల్లుల నిట్టూర్చి తూలెనోయి.

అసలు నీమీద నిల్పిన యాసకొసల
జారిపడిన స్వప్నాల లేశాలె, నన్ను
ముంచుకొనిపోవు, నాశరీరాంచలములు
తెంచుకొనిపోవు, కనుకదృగంచలములు.

ఏమియును కోరుకోలేను ఇప్పుడు అప్పుడు
త్వన్మధురదర్శనామూల్యభాగ్య మొకటి
దక్క అన్యమ్ము వలదు, సుధాపునీత
హృదులరాగమ్ముతోనేది ఈ మనస్సు.

అవునులే, లేశమైని శోకాతిరేక
మాచికోలేము; లోకమే అతిచిరాను
భూతగీతికతో నర్తించిపోవు; మౌన
గతిని రేయితో సుప్తజీవితము గడచు.

ఏదియెటులైన గానిమ్ము ఇరువురమ్ము
ప్రేమసీమాంతముల విహరించినాము
సోగవెన్నెల శాల్మలీసుమములట్లు;
ఎన్నటికి నేని నీదాననే నిజమ్ము.

# దేవి

అదిరథమ్ము, ద్యోవీథీవిహారసీమ
నవతరించివచ్చినది ఆశాశలెగయు
నీవధిష్ఠించి సాగయుచున్నావు దేవి!
ముగ్ధమాధురీ స్వాప్నికమూర్తి వోలె.

ఏను పదసీమ నొదిగిపోయితిని, నిన్ను
జూడనాసమోసులువెట్ట, సుప్తమౌన
మధురలజ్జానవోన్మీలమంజులమ్ము
నీకిశోరశంపాపాంగ నిశితరేఖ.

దేవి, లక్ష్యమ్ముచెదరని దృష్టికపుడు
గోచరింతువు రోదసీ కుహరపదము
మెరసిపో, మధుజ్యోతిస్సు గురిసివైచి
నిలుకడలుగన్న సౌదామనీవిధాన.

సౌరభమ్ముల్రోయిన పూలదారులందు,
ప్రతిసుమముఖమ్ము హాసించి స్వాగతమొసంగ,
హారచైత్రమ్మును మేఘకుమారి లలిత
భరతనాట్యకళా కలాపమ్ము ల్రోసె.

# శుభాంగి

నేను కార్తీకమాసాంత దినము, మొరసె
నీనభస్సు, జలదరాగ మిపురువెట్టి
చేబుకొనె విషాదప్రతిసీర; దెసలు
సాంఖ్రితమ్ములై నటియించిపోయెనేను.

జల్లుగాఁ దూఁగసాగె వర్షమ్ము, నీదు
రూపు నింపుకొన్నదికనుపాపలోన;
కరఁగిపోనీను, మాసిపో చెరగనీను,
నించుకు మననీను, నాలోనిమిడ్చికొందు.

ఈ ఇమిడ్చికొనిన రూపు ఇంతలింత
లౌనో, చెరగి మాయునో, విషాదాంతగీతి
కౌనో, సుమధురమోదామోద లలితరేఖ
చాయగా పురివిచ్చిన జాడ సగునో.

తెలిపకోలేక పోలేము; తెలియరాని
బాధతో, తపియించిన బ్రతుకు, మహాన
హృదయగీతాలిత్తో, ఘనాసృత్తైనుయిర
శూన్యాలతో పొరలాడిపోనను శుభాంగి.

❖

దేశి నవవిత్రాలయదీపశిఖలు
మార్గాలు రచించుకొన్న నేపథ్యభూమి
నిలిచి యున్నాను పూజానిర్మలమతిని
సన్నజాజులు దోసిట సంతరించి.

క్రొమ్మబ్బుల చాలు విరబోసికొనగ, జాతి
జాలుగా రాలిపడిన ప్రసవసమానోజ్జ్వ
తారకాకోరకములు దొంతరలు చూచి
చమత్కారాలోకనాన నిశానతాంగి

ఈశాన్యప్రసంగాలు లెగిసి ఎగిసి
నన్ను వడకించు, అవ్యక్తఘంటానినాద
మాలికా సెయ్యల్ల నటియించి పోవునేలా
హృదయజీవితసాంత్వస్పందనమ్ము.

✣

ఏవల వేచెనో పరిమళించిన
    జీవితభాగమందు న
న్నే వరియించినావు; తలపించుక
    తోచని మేచకాగ్ద్రి శ్రీ
ధీవిలసన్నవోదయము
    తీయమునోయెను; పూవుపూవులై
పోవులు వడ్డలేతవలపుల్
    మధురించి సుమించె జీవికన్.

ముసి ముసి నవ్వులన్ విరియ
    బూచిన మెత్తని పుచ్చపువ్వులై
న్నిసికతసీమలన్ కలసి
    నిత్యమునృత్యముచేయు, ప్రత్యుషః

హసితమ్ములైన నీపచక
    తాంబకముల్ సుమలన్ చివుర్చు, నీ
వసలె, ప్రసూనకాంతివయి
    యాశలఁబోయెదు, సందెచాయలన్.

ఇరుపుఁ చూపు లేకమయి,
    ఎన్నిసుమాలనో తేనెలూర్చె, తా
మరసకిశోరపత్రముల
    మాటున పాడెదు తేటిపాటలన్

విరిసిన స్నిగ్ధరాగమధువే,
    తరళించెదు నాయెడందలో
మొరసిన జీవగీతికలు
    మోగిసెను మంజుల శింజితమ్ములై.

❖

పూవులఁ రేకులూడిపడి

పోయిన యీమునిమాపుచాయలన్

తావుల నొల్కఁబోసినని

తారకకోరకనాళి, నాయెద౯

మోఁవగరాని రాగమధువుల్

నటియించి విలీనమాయెఁ గ్రో

త్తావినిమానొ; చీకటులె

కాంక్షవనూపునొ; జీవితమ్ములో.

# పౌషి

మిసిమివెన్నెల, తొలుకారు పసిడివన్నె
మొగలిపూల కన్నెల సరమోప్పు నిదుర
కలువరింతలు, చివురొత్తువలపు రేక
లేతనునుమబ్బు రేకలో లీనమాయె.

మధురమేమొ, ఆశారాగమధురమేమొ,
నీహసించు వెన్నెల, హిమానించి, పదుచు
కన్నెలగసంగె నగవు నిగారమందు
విరిసివాపించిపోయె, జీవించిపోయె.

కలలై, తారలై వెన్నెలలై చలితలలిత
రాగమూర్తులై, వినువీధమ్రోగిపోవు,
లేక, ఈనాడు ఏనాడులేని ఇంత
మధురిమోన్మత్త లాస్యసీమంతమేమి.

ఓయి తారామనోహరా! యుష్మదీయ
హాసరాగానురాగ వీక్షాంచలములు,
నాకుటీజాల పదసీమసోక, సుప్త
తప్తహృదయమ్ము త్రుళ్లి నిద్రాణ మాయె.

అప్రుడు సాంత్వన మిత్రములైన నీ సు
ధాకరమ్ము చూచితి వీవు నాకరమ్ము
కోరకు, అరచాటు సిగ్గు దొంతరల నిమిడి
కూర్చుకొనుచుండ ప్రేమావకుంఠనమ్ము.

నానిశాలోకనావేదనానుభూతి
చూచి; చకితభ్రుకుటిలతాక్షోభ చూచి
మూతవారిన కనుల్తొ పులకరించి
విచ్చుకొనిపోవ, చుంబించివేసినావు.

పతితనిర్జనజీవితస్మృతుల, వెలుగు
చీకటుల కౌగిలింతల చిందులు, కుటిల
నీలినీలాలకాలిక నృత్యకేళి,
స్వప్నవీధిక నలసాలసమ్ములాయె.

మనలదేనాటి బంధమ్మొ? మలసిపోని
సాగసిపోని యాశాకాశశుభ్రవీధి
నిదురదేలిన యెద గదియింతునోయి,
అంతమేలేనికాల మున్నంతవఱకు.

అంతనేసోలిపోదు, నీవంతనిత్య
యాత్రసాగించుకొనుచు, వియత్తలాన
పరిమళాహ్వాన తోరణపంక్తులల్లు
చెచ్చెరచ్చటికో ప్రయాణించిపోదు.

# సంక్రాంతి

పసుపుపచ్చనిపైరులు మిసిమిరేకు
అందగించుకొన్నవి, పాయలై స్రవించె
వృద్ధగౌతమి, ఇంటింటవిరియబారె
నీలికలువరేకుల తోరణాలమాల.

నింగినీలాలచాలులో రంగవల్లి
సందెఱుపులుగా నందాల చిందె; చదల
నల్లుకొనియె, హేమంత దినాంతలాస్య
మంగళాంతగీతిజ్యోతిరింగణమ్ము.

శుక్లపక్షనవోదయస్ఫూర్తిలోన
మలయువలిగాడ్పు వడకించు తలములందు
ఎడఁలు ఎదలు పేరిమార సూత్రించుకొనును
విశ్వరాగమ్ముతో ముడివేసికొనుచు.

వాఁడి, వెన్నెలబెళ్ళు, గొబ్బిళ్ళనాఁడే
బడలియున్నావు, ప్రణయోపమునకు నలత
తీరకయుండేదు, ఇంకప్రతీక్షకానె
గడపగానె నా మానసకల్పకమ్ము నంటుము.

నీమోవికొసలు, ప్రాణింపుకొన్నను, దేశ
కాంకెఁబంధూకరాగప్రశస్తి
నీచికురపువ్వులే, నిశితమాసుక్తుల
దమ్ములై వలయీకృతమ్ములాయె.
నీకనులైనవి, ఆకొన్నకోరిక
దుళ్ళింతలాడు ప్రరోహకములు
పులకించిపోలేని పలుకుసోనలమ్రోత
తే, పావురగుబాళిఁ పునాలిక.

పువులు పువ్వులుగా విరబోసికొనుచు

నీవుపోయినదారుం నీడలందు ॰

చిన్నరుజూపులంతో సుధాజీవితమ్ము

కలుపుకొన్నది మకరసంక్రాంతిసిరుల

# ప్రసక్తి

చరమసంధ్యానగేశ్వర, చరణహస్త
లలిత విన్యాసరేఖికా విలసనాన
అమర సుమరాగరంజితమైన ఎడద
తాండవించెను మృత్యుగీతాప్రసక్తి.

❖

నాకనుపాపల్లో విరిసి

నాట్యముచేసిన నీదురూప రే

ఖాకమనీయతల్, చకిత

కాంతుల నూలల తేలిపోయి, నా

నాకతుబంత వీధుల,

మృణాల మనోజ్ఞ విపంచికానినా

దాకుల రాగ పాళికల,

తారెను తీయుని స్వప్నరేఖలై

ఓమధుశోభనా! సురభి

ళోదయవేళల, పాలిపోయి నీ

కోమల రూపరేఖ

వినిగూహనమార్గములన్ నటించిపో

నీ, మలయానిలాల

పులకించిన గౌతమి లేతగొంతులో

ప్రేమసుధారుచుల్ చిలుక

రింపని, నేతనివొందకుందునా.

నీనయనంపు నీలపుకనీనిక

లే, నెఱచూపులే విభా

తానిల చాలసమ్ముల

అనంతమ్ములై నటియించిపోయి, శో

భానట దూర్మికాశిఖర

పాళికచీకటి రాసింగోయఁగా,

సోనలువార నేడ్చెదన,

శోషిలిపోదున, స్వప్నవీథికన్.

# ప్రత్యాశ

ఇపుడు నాగొంతుమూగవోయినది, వాన
కారు; గాయని కోయిలే కలికిగళము
నొత్తు; వినబోదు చివురివురొత్తుపదము
లామొహ్హృదయమే జడమాయె, అచలమాయె.

ఇంకకనియేమి, మనియేమి, ఎగసికొన్న
నంచుగాలిజల్లుల తలారించుకొనుచు
పదముసాగింతునేకాంతపదవియందు
ఆమెకనులే తమస్తమస్సాంకితములు.

ఏనుపాడిన, గీతు, లాలింపలేదు,
వలపుకారుటెడారి; కలలనిశీధి;
పూలకడుపులో భాగ్యవిభూతి మాచు
నామెబ్రిదుకులో లేవలపాశలేను.

కలలపదాల తూలుచు

సుకమ్మగు నిద్దురలేని నేను, ఆ

కలితమ్ములైన జీవిత

సుఖోర్మ్ములతేలుచు; చుక్కపాటులో

కలసిన యట్లౌదు,

ముదికాంక్షలు మ్రోయును చీకటింటిలో

తొలగి వెలుంగు రేకులయి

దూరపు దారుల సన్నసీడలై.

మాసిన జీవితాన, వలపారిన

కోరెక, చిందిచింది ఆ

శాసకలమ్ము మ్రోయుచు

నిశాదివముల్ పులకింపజేయు, ని

శ్వాసమధూళిశాపదము

. చక్కిలి గింతల పాటపాడి, ఏ

నేసట యేనిలేక

వినిపించిరగుల్చునెదఁ పదేపదే.

హాసములో, తమాలమసృణామృత

వీక్షలో, లేతహస్త వి

న్యాసములో, ఎవోమరి

హృదంతరమున్ కలగింపువెట్టు, నీ

వే సడిసన్నయున్ జలద

రింపనివేళల వచ్చినావో, కా

నీ, సితమేఘుమట్టుల

చరింతును నేను విషాదవీధులన్.

# అదృష్టవతి

ఓ అదృష్టవతీ! చేతిచాయలందు
దిరిసెన సుమాలు వరాలుగుఱియు, లలిత
జీవితానందమందాల చింధు; చిందు
అమృతవాసంతలవలీలతాంత మధువు.

ఆ కరమ్ము కోసమ్మె, ఈ హాయసమ్ము,
త్రిజగతీహృదయమ్ము, నా హృదయమటుల,
వేసటీవిసువేలేక వేచికొనును,
ఒక్కనిమసమ్ముకా, దొక్కయుగముకాదు.

చలువ విరియుని విషమంపుజల్లులందు
మృదులకైశికపాళిక చెదరబార
సగము సగము మూతలు దీరుమొగుడలేదు
ఉభయసంధ్యల మేఘమాసోత్సవాల.

అప్పుడెప్పుడో కలగాంచి, యువశమైన
నాటికాంక్షాకణాలె, కన్నీటిచినుకు
రొదలసొలసె, కలనె సాగరోదగాల
అలముకొనుచేమొ విశ్వవిశ్వాంతమిపుడు.

ఎన్నినాళ్లైనగాని సౌహృదిని ఇగురు
వలపు, కడగంటి తెలిరెప్ప దళములందు
నిదురదేలిన చదలేటి సొదలనడుమ
కరగిపోయినవెన్నెన్నో గళరవాలు.

ఇపుడుకాదు మరెప్పుడో ఇవముకొన్న
బ్రిదుకునకు తరళించిన పరిమళాలు
చీలికలు-చీలికలు వారి సీలిదారి
తరలిపోయెను తరళాంశుకరమొలేక,

ఆశలే అంతులేక ఆశాశలందు
గడలుకొననిమ్ము; హృదయమ్ము బడలనిమ్ము;
విరులెగాని, సంజపెదవి విరుపెగాని
లేక, మృత్యువునే కబళింపనిమ్ము.

ఎదను గుదియించు తుదినాటి ఊహలెల్ల
చెదరిపోవనీ, చెదరినశింపనీ వ
నీపదాంతాల, స్రోతస్వి నీపదాల,
విరులు ఇముడునా కాగ్గొన్న ఇరుల తెరల.

ఆలవలీలతాంబిక, దృగంచల

చంచల చంచరీక వీ

క్షాలవమాధురుల్, విరియ

జల్లిన, గొజ్జగి సెజ్జలందు, ని

ద్రాలసతన్, కనుల్ మొగుడ,

ఆరని తీరని శోకవేదనల్

వ్రేలెను, మాలలై, గగన

వీధిని రాగమయూఖపాళులై.

విరిసిన సందెలో కలయ

వీచిన, గాలుల మందవాసనల్

శిరివిగ సోనలై కలసె,

ప్రేమపుటూర్పుల సందడింపులన్

మరగిన బాష్పపాళికల
పాటరొదల్ ధ్వనియించె; పచ్చక
ప్పురపుసువాసనల్ మఱపు
వోయినతావుల కోరగించెడిన్.

పవడపు కాంతి చిప్పిలెడు
భాగ్యవతీమధురాధరమ్మునన్
కవిసెను; కావికావిరులు
గాఢముగా, కబరీ విసీల మ
ట్లి; వమినమంచు జల్లు
పులకింపుల జీవితరాగముల్ పువుల్
పువులుఁగ సౌఖ్యముల్ విరియ
బోయవుసిద్దురలేని శయ్యలన్.

నా యెదరేగు కోరికలు

• నల్లని మబ్బుల నీలిచాలులన్
మ్రోయుచు మూఁగవోయెను,
విముక్తవిషాదవిహాయసాన నే
నే నెటకో యొకప్పుడు
చరింతును, క్రొంజిగురాకుతోటలో
చాయలు చాయలై విరియ
జల్లిననీడల నందగించుచున్.

# నిశ్రేణి

ఈధనుర్మాస సౌభాగ్యమేమియేమి
ఇంత జీర్ణించుకొన్న నాహృదయమిపుడు
మ్రానువడ్డది; మధురసంధ్యానిలంపు
శీకరమ్ములనేని హాసింపకుండ.

ప్రకృతి, కాంతిల్లి, మధుర శోభనల, పుచ్చ
పువ్వు లేత వెన్నెలల, నవ్వుకొని, ముద్ద
బంతిచేమంతి బంతుల పరువుచూచి
మోమువాంచి, సుధాత్రపామూర్తియామె.

ఎవరు లేరేమినాకు! నేనే విముక్త
విరహానుషిరానమ్రోసిన, తరళనయన
పాళికామధుమాలికా పదములోలయు
అసుర సంజలో గొంతెత్తి అవసిపోతి.

మూగచెరవీడి ఎప్పుడు ప్రొద్దుపోవు
ఇన్నినల్లనికన్నులు నన్నుచూచు;
తెప్పవాల్పవు, గ్రుడ్లు ద్రిప్పుకొనవు,
వెలిచిపోదు నేమోయన్న బెదరులేదు.

ఆశతో, రాగసూత్రమ్ము లల్లుకొనుచు;
మొక్కవోయిన లోకమ్ము పొంతబోక
తూర్పురేఖలో నిట్టట్టు త్రుళ్ళిపడుచు
కదలుప్రాకగా నిశ్రేణి గట్టుకొందు.

## ౮ వయఃప్రా

శ్రావణ చంద్రికా మధుర
    శాలల, నీ తెలివాలుకన్నుఁ రా
గావిలమై చలింప, కుసు
    మాంశులజాలుల జాలువార్చి, పూ
దీవలు మ్రోఁగుపోయి, తరి
    తీపులు పోయిన స్వప్నవాటి ని
ద్రావిరతిన్ విసీలచికురాల
    పదమ్ముల నూర్పుబుచ్చెడిన్.

పచలపన్నినావో, కల
    గింపులు పోవని నా యెడంద బం
ధానిబమై తపించి కలతన్
    సిసికింతలు వారె, రాగముల్

ప్రోవులు వడ్డ జీవవధమున్
మసివారిచిపోయినావు, ఈ
శ్రావణయామినీ హృదయ
రాగములన్ వసివాళ్ళు వార్చుచున్.

ఏవెలి దమ్మిపూవు కృశి
యించిన నావిరహాశ్రుపాళికా
జీవిక, జీరవారిన విశీర్ణ
హృదంతరశోక వేదనన్;
రేవెలుగేని మ్రోయుదు
దరిద్రము, శూన్యము, పాడువల్లకా
డీ, విధిహస్తనాలితము
ఈబ్రతు కెట్టి సమాప్తికోరునో.

నేనువిషాద గీతికల
నీపదసన్నిధి పాడినాను, కా
నీ, నిదురాలసాన బరు
వెత్తినకన్నులు పక్ష్మలించి, స్వ
ప్నాన, రహస్స్మృతిస్ప్రహాల
వ్రాలినవల్లిక వ్యై హాసించి నా
వీనిశిమాధురిసే కలగి
వేగెను నాయనుభూత సౌఖ్యముల్.

ఈవెలి వెన్నెలన్ ఎద
నటింపులువోయిన తీయకోర్కె నె
త్తావి, నిశాసితాంబుద
పథమ్ములయంచులతూగిపోవు, ఏ

ఏ విధురామరప్రణయ
పూరిత విశ్వవియోగరేఖికన్
ప్రోవులు ప్రోవులై విరిసి
పోవును నా బ్రదుకార్చిపోవగన్.

నీయనురాగగీతిక కనీనికలన
తరలించి, శ్యామికా
చ్ఛాయల తారితారి, కలసజ్జల
శోటిట్రిలి మాసిపోయె, శో
కాయతనాస, నేనెరుధిరాంశుల
నింపిన జీవపాత్రి సి
వేయమరామృతస్నపిత
పీథికజాంర్చితి సన్నసంజగా.

మ్రోయుచు రాగవీచిక

విముక్త హృదంతరవీథి, నీలమై

పోయునవీధి నిగ్గుల

వెలుగ్చును వెన్నెలపుగ్గులు, తారకా

ప్రేయసి, కంటినీరు

నునువేడి తలంపుల తారులాడ, కై

సేయకయే నశించు

వలిసిగ్గు తొరంగిన నీలినీడలన్.

తెలినురుగుల్లు వోవుచు

నదీమణి గౌతమి చాచికొన్నయా

నలు సకలాశలన్ విరిసి

సాగరమేఖలలై లయింప, నీ

ఇదిసహింపగారానిదే నేసహింతు;
ఇదిబ్రతుకు గతిఘుంచుకొన్నది, అమూల్య
మినిపవిత్రమోహాక మీవేయొసంగి
నావు!

అంతమే లేని కటికటో కాంతమేని
కోలుపోదునా, గొంతెత్తి కోరుకొందు
నా, నిశాంతపవిత్రశాంత గజ్ఞానశాంతి
ఈసియుక్క శోకమ్ము నాకేసుఖమ్ము.

# నేను

ఈనవాషాఢసంధ్యలో ఇగురుగాలి
తొందరల కౌగిలింతల త్రోపులాడి
మ్రాగికొని, విడిపోయిన మొయిలుతునుక
నేను, నాదారిలో వెలుగనిలేదు.

నాశరీరాంచలాల పలాశమసృణ
తరుణాతుహినారుణము విభాసురముకాదు;
ఉదితమేలేదు, సుషిరాశుభోత్సవమ్ము,
కటికచీకటుత్రిప్పింతల కలగిపోదు.

నన్ను ఎవ్వరైనజూతురా, నాకు జాలి
గీతికలు వినుపింతురా, లేతగొంతు
బానుగువ్వోవునో; కన్నీటిపానలదేలి,
గాలినిట్టూర్పుజాలులతూలిచనక.

ఏను గొంతెత్తి పాడ్చిన పద్యగీతి
ఎవరిచెవిసోకక, నాసఖిహృదయతంత్రి
నొత్తునా; ఇంతలో రాగమొదిగిపోన
కడలుబధిరీకృతమ్ములు కాకపోవు.

ఏను గాలిపక్షాల చరించి, ఎరుక
లేనిదారుల బడిపోయి, నానివాస
మెప్పుడు జేరిగోలేక, స్వనింపలేక,
వెలుగుస్వప్నాల చేజార్చివేసికొందు.

నాసకియకన్నులరమోడ్చ, మోసికొనిన
బ్రిదుకు బరువెత్తి కన్నీటిపదములూర్తు,
వెకిలిచూపుల సందళ్ళ వెలితితోడ,
ఈవిషాదయాత్రికు సొంతమేమిలేదు.

# ప్రవాసి

ఈ అరుంతుదదేశంబు హృదయమునకు
నిలువ గోదింప నిట్టూర్పు నీడలేదు
కాలుకదపితినేని అఖాతకఠిన
శూన్యనైరాశ్య గర్భాన సుడులువడుదు.

ఇంతకన్నింటి తపియించియేసి, ఈయ
నంతలోకాన కటికశూన్యమయిపోయె
శ్రీవశ్యామలాంబోధరములకొనల
మినుకులొత్తెడి నాంధ్రకమనీయకాంతి.

తుహినరేఖామనోజ్ఞ మాధుర్యలేశ
మేని, నాలోననే మధురించుకొనగ
హస్తములసాచి నాహృదయమ్ముసాచి
పేరిమవాసనాపాశాల వెదకుచుంటి.

సంశయచ్ఛాయలందు విశ్రమము విడి
రగులుహృదయాన, ఆశలు రాపువెట్ట
మరిమరీ గవేషించుచు తిరుగుచుంటి
నదిమషీభీషణనిశీథమైనసరియె.

నాపిపాసార్తి వాయక, నసనసినసి
మునుమిలుపుఁగోసమే కాఁగిలనువహించి
తెలియగారాని బాష్పతోక్కు–ఘులనలని.
కాంతులు, సలంతెయూరాహులు, కలలగాంతు.

నాబ్రిదుకుదారికొకటె యానందబాష్ప
రేఖ, వాసింపమది తెలారిలుదుగాని
కాలయాపనజీవాన కలయుదిరుగు
భృంగడింభకమోశ్రె జరిభ్రమింప.

ఏమి జ్ఞప్తించుకొన్నానో; ఏకముయున్న
అందమౌ జీవితస్వప్నచ్ఛాయలు రగిల్చె,
ఇన్ని కల్పాలు గడచిపోయినను, మఱల
చివురు పెట్టదు, వలపుల నివముకొనక.

ఎపుడు నాలోని ప్రేమ నశించు, నపుడె
నేను; పావురాకంఠాల నిలిచికలసి
పొంగిపచ్చగుబాళింపుల పొరలుకవిత;
నీరసిలి, రాలిపడి, మరణించిపోవు.

ఏయనూహ్యాయామినీశేయో, జిహ్వికలసాచి
భీకరాట్టహాసాల ఝుంకరించి
నాశిథిలజీవితపథాన, సర్వసమ్మృ
సలుపు, నేయింబవేలు ఘుంటియాలుసుడింప.

ఏనిముసమేని నాకమహీతలాన
కలుష నిష్ప్రహవేద నోచ్ఛ్రితమైన
విలయఘూర్ణ తిరస్కార కలనదక్క-
ఇతరమేకినరాదు......

# నివృత్తి

ఇదివిషాదజీవితము, కృశించి, చవితి
వెన్నెలపసందు లేక మార్వెట్టుపూల
పుటికలో లీనమైనట్లు, ప్రొద్దుపోవు
అపుడొ ఇపుడొ విశాలవిశ్వాంతమందు.

లేనిపోనియూహాపవమానగాన
మధువుచిందినతావుల, శిథిలమంది
కృంగుపడియున్న నాయెద కోలుకొనని
పూర్వసౌఖ్యానుభూతిలో పొగులురగులు.

అంతకంత కనంతకల్పాంతమందు
జీవితము, వేడికన్నీటి చినుకుతునుక
గా, నిడుదయూర్పు రేకగా కరగిపోయి
కలసిపోవు స్వప్నావలోకనములోన.